శ్రీ

గురుభ్యోనమః.

శ్రీమద్దేవాంగపురీ

# నాగలింగేశ్వరస్తవ

# నక్షత్రమాల.

ఇది

శ్రీదేవాంగకులోద్భవుండగు

కట్టా. అచ్చయ్యకవిచే

రచియింపబడి

బ్రహ్మశ్రీ. బండారు. ముత్యాలయ్యగారిచే

ప్రకటింపబడి

మ.గా. కొమర్తి పుల్లయ్యగారి

స్వకీయ

శ్రీకన్యకా పరమేశ్వరీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

బాపట్ల. 1911

శ్రీ గురుభ్యోనమః.

శ్రీమద్దేవాంగ పురీ

# నాగలింగేశ్వర స్తవ

# నక్షత్రమాల.

---

శా. శ్రీదాక్షాయణిహృత్పయోజ మధుపా

శీతాంశు వస్త్రాళిభ

ర్గా వంశావళి దైత్య భంజనహరా

గంగాజటాజూట శ

ర్వాదీనావన చిత్ప్రకాశ శుభదా

వందేసదామానిపా

పాదేవాంగ పురీనివేశ భవనా

శా నాగలింగేశ్వరా.

సీ. కిన్నరేశ్వరమిత్ర • గిరిజాతచారిత్ర
సూనసాయకవైరి • స్తోత్రపాత్రి
యఖిలజీవాధార • యంచితగుణవార
యంబుధితూణీర • యఘవిదూర
ఫాలనేత్ర మహేశ • కాలకంధర యీశ
పాలితామర్త్యతతి • శూలపాణి
వైకుంఠనాయక • వైభవదాయక
కైలాసనాయక • కాలరుద్ర
గీ. వృషభతురంగ పార్వతీ • హృదయసంగ
భూషితభుజంగ భసితాంగ • ప్రవిభంగ
వసుధదేవాంగ పురవర • వాసయీశ
వశజనహృదబ్జసారంగ • నాగలింగ.

నాగలింగేశ్వర స్వామి స్తుతమాల




సీ. మానీంద్రసందోహ • మానసవీధుల
వర్తించుపరతత్వ • మూర్తివీవె
యఖిలభూతంబుల • కాధారభూతుండ
వయి వెలింగెడువిశ్వ • మయుడవీవె
ప్రళయకాలమునందు • సంగరుద్రుండవై
తేజరిల్లినగుణ • రాశివీవె
యెందెందుజూచిన • నందందుశక్తితో
నిండియుండిన విభు • యుండవీవె

గీ. యంచు నుతియించె నప్పగా దె • యఖిలజనులు
నీమహాత్వంబు బొగడంగ • నేర్తు నెట్లు ?
వసుధ దేవాంగ పురవర • వాసయోని
నతజనహ్లాదబ్దనారంగ • నాగలింగ.

## నాగలింగేశ్వర స్తవరత్నమాల.

సీ. నిరతసత్ఫలమిచ్చు • నిగమంబులెవ్వాని
నిశ్వాసములె యన • నెగడుచుండె
నవరసాలంకృతి • భువనంబదెవ్వాని
చిహ్నంబటంచను • జెప్పుచుండె
నానందకరుడైన • యమృతాంశుడెవ్వాని
హృదయమంచని జెప్పు • ని[illegible]
వనజాప్తుడైనట్టి • దిననాథుడెవ్వాని
చక్షురింద్రియమన • జనుమీరె
గీ. నట్టిబ్రహ్మంబుపై వాయు • నభినుతింతు
సర్వకారణకారణ • శత్రుహరణ
వసుధ దేవాంగపురవర • వాసగా[illegible]
నతజనహృదబ్జవాసంగ • నాగలింగ.

సీ. అర్ధనారీత్వమ్ము • దలఁచియుండుటచేత
పురుషుండవని నిన్ను • బొల్ప లేను
గడ్డంబుగొప్పారఁ • గలిగియుండుటచేత
స్త్రీయని నిన్ను నే • జెప్ప లేను
పద్దాలానునాటి • పెద్దవైయుంటచే
బాలుండవని నిన్ను • బలుక లేను
గతజరామరణవం • స్థితుఁడవైయుంటచే
వృద్ధుండవని నిన్ను • బిలువ లేను
గీ. అజుని కూల్చిన పాతకి • వనగ లేను
నీచరిత్రంబు నాకెట్టి • దోచదయ్యె
వసుధ దేవాంగ పురవర • వాసయీశ
నతజనహృదబ్జసారంగ • నాగలింగ.

6. నాగలింగేశ్వర స్తవనక్షత్రమాల.

సీ. నీయాజ్ఞచేఁగదా • నీరజోద్భవుఁడైన
జీవకోటులసృష్టిఁ • జేయుచుండె
నీయాజ్ఞచేఁగదా • నీరజాధిపుఁడైన
ప్రాణిసంతతిఁ గాపుఁ • గర్వమ్ముగనియె
నీయాజ్ఞచేఁగదా • నీరజాప్తుండైన
పరఁగ నియమంబుగా • దిరుగుచుండె
నీయాజ్ఞచేఁగదా • నీరజారాతియునుఁ
పరఁగ నోషధులఁగా • పాముచుండె

గీ. నీయనుజ్ఞను మేఘుండు • నీరొసంగి
పైరులెల్లను చక్కఁగాఁ • బండఁ జేయు
వసుధ దేవాంగ పురవర • వాసయోశ
పతిజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. వేదశాస్త్రపురాణ•విద్యాప్రసంగులై
నెగడెడు పెద్దపం•డితులు నైన
సత్కావ్యనిర్మాణ•చాతుర్యముగల్గి
వరలుచుండెడుకవీ•శ్వరులు నైన
కిన్నరతుల్యులై•కీర్తనంబులపాడి
యలరారుచుండు గా•యకులు నైన
ఘనతపోధ్యాన•మునుగాంచి యడవుల
దిరుగుచుండెడు మునీ•శ్వరులు నైన

గీ. నిన్ను ధ్యానించిమదిలోన•నిలుపకున్న
ముక్తిసేరీతిబొందగా•శక్తిగల్గు
వసుధ దేవాంగ పురవర•వాసయీశ
నతజనహృదబ్జసారంగ•నాగలింగ.

# నాగలింగేశ్వర స్తవనక్షత్రమాల.

క్రమముదప్పక యెత్రి•కాలంబులను వేడ
పాంబొనర్చిన•ఫలముగాని
యనుపమమగుతీర్థ•యాత్రలభక్తితో
సలిపిపొందినయట్టి•ఫలముగాని
దానధర్మంబుల•తగురీతిగావించి
వాసిచేకొన్నట్టి•ఫలముగాని
యెట్టివేళలనైన•యెంతకష్టమునైన
పలికిబొంకనియట్టి•ఫలముగాని
నీయనుగ్రహ మొక్కంత•నాగడకున్న
గలుగనేర్చునె జనులకు•కలుషమడగి
వసుధదేవాంగపురవర•వాసయీశ
వరజనహృదబ్జసారంగ•నాగలింగ.

సీ. బ్రహ్మాండరూపనీ•పదయుగళంబుపై
స్థిరభక్తినిలపని•శిరము దేల
సకలాంతరాత్మనీ•స్మరణంబుమరువక
సేయుజాలనియట్టి•జిహ్వయేల
భువనరక్షణనీదు•పూజలునిత్యంబు
గరిమతో సలుపని•కరము లేల
వేదాంతవేద్యనీ•విశ్రుతసత్కథల్
వినని కర్ణంబుల•విధము దేల

గీ. నిన్నుగనజాలకున్నట్టి•కన్ను లేల
పరగ నీసేవ సేయని•జన్మ మేల
వసుధ దేవాంగపురవర•వాసయోగీశ
నతజనహృదబ్జసారంగ•నాగలింగ.

క్షీరాబ్ధి నుదయంబు • జెందిన గరళమున్
మిసిమి ముద్దవిధంబు • మ్రింగె నెవడు
క్రూరాత్ముఁడగు గజా • సురుని చర్మంబును
కనకాంబరము రీతిఁ • గప్పె నెవడు
పరిబలగర్వముగన్న • బ్రహ్మకపాలంబు
కుడలో ధరియించి • మెరసె నెవడు
నిఖిలభూతపిశాచ • నిలయమౌ వల్లకా
డిల్లుగాఁ గొని వసి • యించె నెవడు

భూతికాయంబునంతయుఁ • బూసె నెవ్వ
డట్టి నిన్నెద నమ్రతి • ననుదినంబు
వసుధ దేవాంగపురవర • వాసయీశ
పతితజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. నినుగొలిచినంతనే • నీయర్ధదేహంబు
మెచ్చి కాత్యాయనికి • నిచ్చినావు
నినువేడినంతనే • నిలచి బాణుండను
కర్కశుద్వారంబు • గాచినావు
నినుభాషించినంతనే • నియుతిగ వాసుకు
మురరంబులో వాస • ముండినావు
నినుజేరినంతనే • యినిరావణునకుబల్
చాగ్రిహాసము వేగ • నంగినావు
గీ. భళిర! నీత్యాగమునుగూర్చి • వర్ణనంబు
పలుకశక్యంబె వేవేల్ల • దిలువ కైన
వసుధ దేవాంగపురవాస • వాసయీశ
నతజనహృత్పద్మపాంగ • నాగలింగ.

సీ. అలఘుభోగమునాగి • వలరుయాగామంబు
నలరింపగావస • తాగమంబు
హృదయానురాగమౌ • మదిమయూరాళికా
నందంబుజూప ఘ • నాఘనంబు
ఘనవైభవంబను • కల్పవల్లిని పెంప
లాలితంబైపట్టె • యాలవాల
మనుపమశుభకార్య • మనెడి పద్మాటవి
పల్లవింపగజేయు • భవ్యహేళి

గీ. మానితంబగునీసేవ • మానవులకు
తాపహాస్ఫీతలోల వ • స్తసమ్మ
వసుధదేవాంగపుంగవ • వాసయూత
నతజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. పరసతీగమనమ్ము • పాతకంబు హరించు
కూటసాక్ష్యంబన్న • కొలనడంచు
యనృతవాక్యము నోని • యఘము నుడెగటాన్చు
వెలయాలిపొందను • కలుషము మాన్చు
సురను సేవించుట • నరకంబు బరిమార్చు
మాంసభక్షణమన్న • హింస మాన్చు
పగటిసంగమమన్న • పాపంబు బోకార్చు
వేదవిక్రయమన్న • వృజనమడచు

గీ. భవ్యమానవనీదగు • భక్తిమహిమ
మింక నెంతసవర్ణింతు • నింపుగ నను
వసుధ దేవాంగపురవర • వాసగుణాళి
పతితజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. దారిద్ర్యమనుస్పృధ • దారువుఛేదింప
గండ్రగొడ్డలినీదు • కరుణగాదె
కష్టసంతతియను • కడలిఘూర్ణిలఁజేయ
బడబాగ్నితావక • భక్తిగాదె
సంకోచమనుకాల • సర్పంబుహరియింప
తార్క్ష్యాత్మమనువునీ • తపముగాదె
సంతాపమనుసామ • జంబునుగూల్పంగ
హరిడింభకము భవ • ద్వ్యక్తిగాదె
గీ. కల్మషంబనుశార్వరి • గర్వమడప
సూర్యమండలమగునీ య • వార్యపేర్మి
వసుధ దేవాంగపురవర • వాసయాశ్రి
వతజనహృత్పద్మసారంగ • నాగలింగ

సీ. గగనమార్గమునందు • గలతారకాళిలో
నిందుఁడు మేటియై • యెనగురీతి
నుపవనంబులయందు • నుండువృక్షాళిలో
కల్పకంబధికమై • గ్రాలునట్లు
భువనంబునందుగల • బొదలు శైలములందు
కనకాద్రిగొప్పయై • వనరుమాడ్కి
మహిమంబుగల్గిన • మంత్రజాలములందు
ప్రణవమంత్రశోభ • గొనినయట్లు

గీ. దైవములకెల్ల దైవమై • తనరిలీవు
నిన్నుఁబొగడంగ నశమానె • నీలకంఠ
వసుధ దేవాంగపురవర • వాసయీశ
వతిజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. ధరలోనగల్గుక్షే • త్రములనన్నిటికంటె
సిరిమించియుండునీ • క్షేత్రమరయ
నరులలోనద్భక్త • సముదాయముల చేత
సేవ్యమైయుండునీ • క్షేత్రమరయ
కంటోగులకనివింప • గలిగించుమహిత ప్ర
సిద్ధియైయుండునీ • క్షేత్రమరయ
నాచారవంతుల • కామోదనిలయమై
చెలువారుచుండునీ • క్షేత్రమరయ
గీ. భక్తియుక్తినిగలిగించు • ఫలితమొసగు
క్షేమముదయింప జేయునీ • క్షేత్రమరయ
వసుధ దేవాంగపురవర • వాసయీశ
వతిజనహృదబ్జసారంగ • నాగలింగ

సీ. చిత్తజారాతినిన్ ♦ సేవించినంతనే
భాగ్యహీనులు మహా ♦ భాగ్యులైరి
పరమేశ నీపేరు ♦ పఠియించినంతనే
పాపాత్ములైన పా ♦ వనతఁ గనిరి
చంద్రశేఖర నిన్ను ♦ స్మరియించినంతన
బాలహీనులు పుత్త్ర ♦ వంతులైరి
రజతాద్రివాసని ♦ భజియించినంతన
భిక్షుకులైన సు ♦ భిక్షు గనిరి
గీ. విశ్వనాయక నినుమది ♦ వేడినంత
లుబ్ధమతులైన బహుత్యాగ ♦ శీలులైరి
వసుధ దేవాంగపురవర ♦ వాసయోగి
వరద సర్వజ్ఞ సారంగ ♦ నాగలింగ

సీ. భవదంశ సంభూతి • బడసిన నేగదా?
యాంజనేయుండు బ • లాఢ్యుఁ డయ్యె
భవదంశ సంభూతి • బడసిన నేగదా?
దారుకావనఋషుల్ • ధన్యులైరి
భవదంశ సంభూతి • బడసిన నేగదా?
కాలభైరవుఁడు వి • ఖ్యాతుఁ డయ్యె
భవదంశ సంభూతి • బడసిన నేగదా?
నరగవశ్వద్ధాము • జయము గాంచె
గీ. యభవ భవదంశ సంభూతి • బడయు కతన
చెలఁగి వీరలు చిరకాల • జీవులయిరి
వసుధ దేవాంగపురవర • వాసయీశ.
నతజనవ్రాతబ్దనారంగ • నాగలింగ.

సీ. అణువునైనను మహా • యద్రిరాజము నైన
సమముగా పాలన • సలిపెదీవు
దోమ నైనను మత్త • సామజపతి నైన
సమముగా పాలన • సలిపెదీవు
పల్వలంబులు నైన • వార్ధులైనను
సమముగా పాలన • సలిపెదీవు
సామాన్యు నైనను • సార్వభౌముని నైన
సమముగా పాలన • సలిపెదీవు

గీ. పక్షపాతంబు నింత గ • న్పడవీవు
కలకు న్యాయంబు నీయందు • కలదుకలదు
వసుధ దేవాంగపురవర • వాసయుక్త
పతిజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. ఎవ్వానికరుణచే♦ నెలమి మార్కండేయు
డిలనుదీర్ఘాయువై♦ యుంపుగాంచె
నెవ్వానికృపచేత♦ నెనసిసానందుండు
ప్రబలవైరాగ్యంబు♦బడసిమించె
నెవ్వానిదయచేత♦నింద్రనందనుడైన
పార్థుండు వరపాశు♦పతముగొనియె
నెవ్వానియనుకంప♦ మెసగశ్రీయాళుండు
కైలాసవిభవంబు♦ గాంచియలరె

గీ. యెవ్వనికటాక్షవిభవంబు♦నివ్వటిలగ
విశ్వజాలంబువృద్ధిగా♦ వెలయునట్టి
వసుధదేవాంగపురవర♦వాసయీశ
శరజనహృదబ్జసార. గనాగలింగ

సీ. ధనవంతులనుయశో • ధనవంతులుగ జేసి
బ్రోచు ప్రముఖ దేవాంగ • పురజనాళి
కోవిదులను వయః • కోవిదులుగ జేసి
బ్రోచు ప్రముఖ దేవాంగ • పురజనాళి
ధర్మదక్షులను గుణ • ధర్మదక్షులుగ జేసి
బ్రోచు ప్రముఖ దేవాంగ • పురజనాళి
కార్యధుర్యులను స • త్కార్యధుర్యుల జేసి
బ్రోచు ప్రముఖ దేవాంగ • పురజనాళి

గీ. నవ్యులెల్లను నవనవ్య • నవ్యుల జేసి
బ్రోవగ నవయ్య దేవాంగ • పురజనాళి
వసుధ దేవాంగపురి వర • వాసయీశ
నతజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. వీరేశ్వరాయంచు • వినుతింతు నిత్యంబు
దారుకేశ్వరయంచు • దలంతుమదిని
సంగమేశ్వరయంచు • స్తవమునుగావింతు
నందీశ్వరాయంచు • నెంతులోన
జ్ఞానేశ్వరాయంచు • ధ్యానంబుగావింతు
భీమేశ్వరాయంచు • బిలుతునిన్ను
దత్తేశ్వరాయంచు • బత్తి నిసలిపెద
ధర్మేశ్వరాయంచు • దాల్తునెదను

గీ. పార్వతీశ్వరయని పాట • పాడుకొందు
నీదుకృపజూపిబ్రోవంగ • రాదెనన్ను
వసుధ దేవాంగపురవర • వాసయీశ
నతజనహృదబ్జసారంగ • నాగలింగ.

సీ. మంగళంబిదెనీకు • మహిమాన్వితానంద
మంగళంబఖిలేశ • మంగళంబు
మంగళంబిదెనీకు • మానితగంభీర
మంగళంబుమహేశ • మంగళంబు
మంగళంబిదెనీకు • మానాథసేవిత
మంగళంబుపరేశ • మంగళంబు
మంగళంబిదెనీకు • మహితతేజోరాశి
మంగళంబుగిరీశ • మంగళంబు

గీ. మధురవాగ్జాలనీదే • మంగళంబు
లింగమంగళమిదెనీకు • మంగళంబు
వసుధదేవాంగపురవర • వాసయీశ
సతతజనహృదబ్జసారంగ • నాగలింగ.

సమాప్తము.

